# గ్రంథాలయసర్వస్వము.

సంపు. ౭ | బెజవాడ - నవంబరు ౧౯౩౮. | సంచిక ౫.


## అఖిలభారత గ్రంథాలయ సభ

ఆరవ అఖిలభారత ధర్మగ్రంథాలయ సభను జరుపుటకు కలకత్తానగరమున గొప్ప ప్రయత్నములు జరుగుచున్నవి. డాక్టరు రవీంద్రనాథఠాకూరుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఏర్పడినారు. ఇంకను సుప్రసిద్ధులనేకులు ఉపాధ్యక్షులుగాను, కార్యదర్శులుగాను ఏర్పడియున్నారు.

ఇదివరలో సభను కొన్నిగంటలలోనే ముగింపు జేయుచుండిరి. ఈసంవత్సర మటులగాక రెండుదినములు చేయుటకు ఆహ్వానసంఘము వారు నిర్ణయించిరి. మద్రాసు, కాకినాడలయందు జరిగిన సభలతో మాత్రము ప్రదర్శనముగూడ జరిగినది. తిరిగి ఈవత్సరము ప్రదర్శనము కూడ జరుపుటకు ఏర్పాటులు జరుగుచున్నవి.

కాంగ్రెసు హడావిడికి పూర్వమే, డిశంబరునెల 24, 25 వ తేదీలయందు ఈసభను జేయుటకు ఏర్పరచిరి. ఆంధ్రదేశమునుండి పలువురు వచ్చి సభను జయప్రదము చేయుదురని కోరుచున్నాను.

## గుడ్డిచదువరులు

మన దేశమందు నివసించు జనులలో నేత్రములు ఉన్నవారిలో కూడ నూటికి యేతొమ్మిదిమంది మాత్రమో చదువగలరు. ఈతొమ్మిది మందిలో వ్రాలుమాత్రము చేయగలవారుకూడ నున్నారు.

## గ్రంథాలయ సర్వస్వము

అమెరికా దేశములో గ్రంథాలయములు నేత్రము లున్నవారికే గాక, నేత్రములు లేనివారికిగూడ ఉపకరించుచున్నవి. గ్రుడ్డివారు నేత్రములతో చదువుకొన జాలరుగదా. అందుచేత వారు చదువుకొనుటకు గాను ఉబ్బెత్తు అక్షరములతో ముద్రింపబడిన ప్రత్యేక పుస్తకములు తయారు జేయబడినవి. వారు ఆపుస్తకములందలి యక్షరములను చేతులతో తడవుకొని చదువుకొనెదరు.

అమెరికా దేశమందుగల ౨౮ గ్రంథాలయములలో ౧౯౨౬ సంవత్సరమున గ్రుడ్డివారికి చదువుకొనుటకుగాను ఇవ్వబడిన ఉబ్బెత్తు గ్రంథముల సంఖ్య 3,00,000 లు. అవేగ్రంథాలయములందు ౧౯౨౭ సంవత్సరమునందియ్యబడినవి 3,౧౨,౪౪౭ గ్రంథములు.

ఒక గ్రంథాలయమందు లేని గ్రంథములను వేరొక గ్రంథాలయమునుండి తెప్పించి యిత్తురు. అమెరికాదేశమందు పుస్తకముల నమ్ము రెండు గొప్పదుకాణదారులు గ్రుడ్డివారల గ్రంథముల క్యాటలాగులనుకూడ ఉబ్బెత్తు అక్షరములతోనే ముద్రించినారు.

---

## తాత్కాలిక పాఠశాలలు

మన మందరము యెరిగిన పాఠశాలలలో విద్యాభ్యాసముచేయువారు సామాన్యముగా కోమల వయస్సునం దున్నారు. ఇచ్చట చదువు వారికి యితరవ్యాపక ముండదు. ఈపాఠశాలలయందు దినమునకు 5-6 గంటల వరకు విద్యాభ్యాసము జరుగుచుండును. ఇట్టి పాఠశాలలలో విద్యాభ్యాసము చేయువారు విద్యాభ్యాస కాలమందు తమపోషణకొరకై యితరుల మీాద ఆధారపడి యుండవలసినవారుగా నున్నారు. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో తమజీవనము కొరకు స్వయం సహాయము మీాదనే ఆధారపడి యుండవలసినవారును, కోమల వయస్సును గడపిన వారును, ప్రతిదినము గంటలతరబడి విద్య నభ్య

సించుటకు తగుసావకాశము లేనివారును, విద్యాభివృద్ధిచేసికొనుటకు మన దేశములో సాధనములేనియు లేకున్నవి. ఇందుచేత విద్యవలనకలుగ వలసిన లాభమంతయు మన దేశస్థులకు లభించుటలేదు. జరుగవలసినంత విద్యాభివృద్ధి జరుగుచుండుటలేదు. ఈలోపములను నివారణచేయుటకు ఏర్పడినవి తాత్కాలిక పాఠశాలలు. తాత్కాలిక పాఠశాలలన నేమో ముందు తెలిసికొనవలసి యున్నది. ఇతర దేశములలో యెట్లుజరుగుచున్నదో ముందువివరించి, పిమ్మట మన దేశమందు వీనిని యెట్లు నడపవలెనో సూచించుట యుచితము.

ప్రథమమున ఇంగ్లాండు దేశమందలి ప్రతిష్ఠాపనలను గూర్చి వివరింపబడును. మన దేశమందువలె విశ్వవిద్యాలయ నిర్వాహణము కేవలము కళాశాలల మూలముననే మాత్రముకాదు. ఆయా విశ్వవిద్యాలయముల కేంద్రస్థానముల చుట్టుపట్లనుండు దేశమునందు కూడ విద్యాభివృద్ధిచేయుటకు తోడ్పడును. ఆవిధముగా ఒక పట్టణమునందుగాని పల్లెటూరియందుగాని విద్యాభివృద్ధిని కోరెడి కొందరు యువకులు ఒక సంఘముగా చేరి తాము యేవిషయమునందు విద్యాదానము కోరెదరో తెలియచేయుచు విశ్వ విద్యాలయమువారిని తమకు సాయముచేయవలెనని కోరుదురు. ఇట్లు కోరినపుడు పంపుటకుగాను ప్రత్యేకవిషయములందు తరిబీతు కాబడిన యుపాధ్యాయులు విశ్వవిద్యాలయము వారిచే నియమింపబడి సిద్ధముగా నుందురు. ఈయుపాధ్యాయుల మూలమున జరుగగల విద్యావిధాన మెట్టిదో వివరింతును. ఏ విషయమందైనను విశేషజ్ఞానము సంపాదించక పోయినను సామాన్య విద్యను మాత్రము అభ్యసించినవారీ ప్రస్తావన విద్యావిధాన మూలమున విద్యాలాభము పొందుట కర్హులుగా నుందురు. ఇట్లు జ్ఞానాభివృద్ధిని సామాన్యముగా కోరెడి విద్యా విషయములలో ఒక్కొక్క దానిని ఒకగంటలోగాని గంటన్నరలోగాని పూర్తిచేయుటకు వీలుగా నుండునట్లు పాఠములు లేక ఉపన్యాసములుగా ముందుగా విభజించుదురు. ఒక్కొక్క

పాఠమును తిరిగి అందు వివరించవలసిన ముఖ్య విషయముల ననుసరించి విభజించెదరు. వీని నన్నిటిని కరపత్రముల మూలముగా పాఠమున కొకటి వంతున ప్రకటింతురు. మరియు ఈపాఠములకు సంబంధించిన విషయములు విపులముగా విద్యార్థులకు సామాన్యముగా నందుబాటులో నుండతగిన ఏయే గ్రంథములందు వివరింపబడియున్నవో అట్టి గ్రంథముల పేర్లనుగూడ ఆకరపత్రములయందు ప్రకటింతురు. ప్రస్తావన విద్యాప్రచారము జరుగవలసినచోట్ల ముందుగా ఈకరపత్రములను ఆయాస్థానిక సంఘమూలమున ప్రకటింతురు. స్థానికముగా జరుగవలసిన వ్యయమంతయు స్థానికసంఘము భరించవలెను. ఇందుకు కావలసిన ఇంటిని సంపాదించుట, సమావేశములు జర్పుటకు కావలసిన ఏర్పాట్లు చేయుట, స్థానికసంఘముయొక్క పని. విశ్వవిద్యాలయమువారు ఉపాధ్యాయుల జీతములను భరింతురు. వారి రాకపోకల ఖర్చులుగూడ భరింతురు. అచ్చుఖర్చులుకూడ వారివే.

విశ్వవిద్యాలయమువారికిని స్థానికసంఘమునకును అన్యోన్య సంబంధ మేర్పడినపిదప ఆ యా స్థలములయందలి పరిస్థితులను బట్టి ఈవిద్యా ప్రచారమునకు కాలనిర్ణయము చేయబడును. కొన్నిచోట్ల వారమున కొకతూరి గంటగాని, గంటన్నరగాని ఏర్పర్చ వచ్చును. ఇతరచోట్ల ఇతరముగా ఏర్పర్చవచ్చును. ఈగంట గంటన్నరలో ప్రథమమున యిదివరకు ప్రచురించబడిన కరపత్రములందు వివరింపబడిన విధానము ననుసరించి ఉపన్యాసరూపమున నిర్దిష్ట విషయము బోధింపబడును. ఉపన్యాసము చివర ఉపాధ్యాయులను బ్రశ్నించి విద్యార్థులు సందేహములు తీర్చుకొందురు. విద్యార్థులు జాగరూకతతో విషయమును గ్రహించుచున్నది లేనిది తెలుసుకొనుటకుగాను వారిని ప్రశ్నించును. ఈవిధముగ అనుకొన్న ప్రకారము ఉపన్యాసము లన్నియు పూర్తియయిన పిదప విద్యార్థులకు పరీక్ష ఒకటి జరుగును. ఉత్తీర్ణులైన వారికి విశ్వవిద్యాలయమువారు సర్టిఫికేట్లు నిత్తురు. అగ్రగణ్యులకు

బహుమతు లిత్తురు. ఈవిధమున ఇంగ్లాండు దేశమందు విశ్వవిద్యాలయ ముల పక్షమున స్కూళ్ళకు కాలేజీలకు వెళ్లుటకు వసతిపడనివారికి విద్యాభివృద్ధి జరుగును. శరీరకష్టము చేసి జీవించువారి విద్యాభివృద్ధి చేయుటకు వారలకు తగినమార్గము లవలంబించు ప్రతిష్ఠాపనలు స్థాపింపబడియుండును. విద్యాగోష్ఠులు ఏర్పరుచుట, ప్రత్యేక ఉపన్యాసముల నిప్పించుట మున్నగు సాధనముల మూలమున కోమలవయస్సు మీరిన వారి విద్యాభివృద్ధి చేయుటకు ఆదేశములందు నిరంతరము గాఢమైన కృషి జరుగుచుండును.

ఇట్లే ఐరోపాఖండమందలి ఇతరదేశములందు కూడ విద్యా ప్రచారము జరుగుచుండును. ఫ్రాంసుదేశమందు స్వయంకృషిమీద జీవనాధారముగలవారల విద్యాభివృద్ధి చేయుటకు నానావిధములగు ప్రతిష్ఠాపనలు అనేక మున్నవి. స్పెయిను, బెల్జియము, ఆస్ట్రియాహంగరీ, హాలెండు, నార్వే, ఇటలీ మున్నగు దేశములందు కూడ ఇట్టి ప్రతిష్ఠాపన లెన్నియో గలవు.

ఈవిధానము ననుసరించి మన దేశమందుకూడ ఎక్కువ ప్రయ ప్రయాసలు లేకుండనే ప్రభుత్వమువారి ధనసహాయములేకుండ కూడ చేయతగినకృషి యెంతయో యున్నది.

మన దేశమందు పూర్వమువలెగాక వర్తమానకాలమందు పల్లెటూళ్లని పిలువతగిన స్థలములందుకూడ సెకండరీ పాఠశాల లేర్పడి యున్నవి. ఇందు దేశాభిమాన పూరితులును విద్యాధురీణులు నగు యువకు లెందరో యుపాధ్యాయులుగా నున్నారు. వీరిసహాయముతో ఇంగ్లాండుదేశములో విశ్వవిద్యాలయముల పక్షమున పైన వివరింపబడిన విధమున నడుపబడుచున్న తాత్కాలిక పాఠశాలల కార్య విధానము ననుసరించి మన దేశమందుకూడ అట్టి ప్రతిష్ఠాపనలను నెలకొల్పవచ్చును. ఆమూలమున యువకులకు విద్యాభివృద్ధి చేయవచ్చును. 1920 సంవత్సరములో రామమోహన ధర్మపుస్తక భాండా

గారపక్షమున బెజవాడలో ఇట్టి విధానము ననుసరించి తాత్కాలిక పాఠశాల మూలమున దాదాపు ఇరువదిమంది యువకులకు విద్యాదానము జరిగినది. మన దేశమందు స్థాపించవలసిన తాత్కాలిక పాఠశాలల విధానమును వెంటనే యెట్లు జరుగగలదో వివరించుటకుగాను కృష్ణాజిల్లాయందున్న పరిస్థితులనుబట్టి మనము చేయవలసిన దేదో తప్సీలుగా రాబోవు సంచికయందు తెల్పెదను.

—సూరి వేంకటనరసింహ శాస్త్రి.

## “స్వీడను” దేశమందు గ్రంథాలయోద్యమము

ఒకశతాబ్దమునకు పూర్వమే “స్వీడను” దేశమందు గ్రంథాలయోద్యమము ప్రారంభమాయెను. ధర్మగ్రంథాలయములకు సంబంధించిన చట్టమొకటి ౧౮౩౦ వ సంవత్సర ప్రాంతమందే, ఆ దేశముయొక్క “నేషనల్ పార్లమెంటు”నందు ఉపపాదింపబడెను; పాఠశాలలయొక్క పనికి సహకారిగా నుండుటకుగాను పాదిరీలకు సంబంధించిన గ్రంథాలయములను స్థాపించుటకై ఆచట్టము అనువదింపబడెను; కాని కాలము పక్వముగాకపోవుటచే ఆచట్టమును అంగీకరింపలేదు. ౧౮౩౫ వ సంవత్సరమునందు ఈఅభిప్రాయముతోనే “కారల్‌స్టాండు” పట్టణమునం దొక సంఘము స్థాపింపబడెను. పిమ్మట ౧౮౬౦ వ సంవత్సర ప్రాంతమందు “సిల్‌జస్ట్రాం” అనునాయన అమెరికా దేశయాత్రకు వెళ్ళివచ్చిన నాటనుండియు, ధర్మగ్రంథాలయాభివృద్ధి పొడసూపసాగెను. పారిశ్రామిక సంఘములు, మితపాన సంఘములు మున్నగు ప్రజాసంస్థలు తమ స్వంతగ్రంథాలయము లను స్థాపించుకొనుటకై ప్రారంభించెను.

అనేక ప్రయత్నములు జరిగినపిమ్మట, ప్రభుత్వమువారివల్ల గ్రంథాలయములకై ప్రథమవిరాళము ౧౯౦౫ వ సంవత్సరమున

అంగీకృత మాయెను. ధర్మగ్రంథాలయములకు గ్రాంటులను గూర్చి ప్రస్తుతము ఆ దేశమునందు అమలులోనున్న నియమములు ౧౯౧౨ వ సంవత్సరమునందు ఏర్పడినవి. "పాల్ముగ్రెన్" అను నారీమణియొక్క నిరంతరపరిశ్రమవలననే యీనియమములు అంగీకరింప బడినవి. "గ్రంథభాండాగారి" యొక్క శిక్షణాతరగతులను ఆమెయే మొదటి సారి యేర్పరచెను. పిల్లలకు తగిన గ్రంథాలయము నామె ౧౯౧౧ సంవత్సరమునందు ప్రారంభించెను.

ఒక గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు 150 లకు తక్కువ లేకుండను, 1,500 రూపాయిలకు ఎక్కువ గాకుండను, ఆదేశ ప్రభుత్వమువారు గ్రాంటుల నిచ్చెదరు. అయితే, అదేమొత్తమును మునిసిపాలిటీవారి యొద్దనుండి గాని, ఇతరుల యొద్దనుండిగాని సంపాదించి యుండవలెను. ఒక మునిసిపాలిటీయందు ఒక్క గ్రంథాలయమునకు మాత్రమే సహాయము చేయుదురు.

౧౯౨౮ సంవత్సరమున ౧౧౮౧ ధర్మగ్రంథాలయములకు ప్రభుత్వమువారుగ్రాంటుల నిచ్చిరి; ఈగ్రంథాలయములన్నింటియందును గలిపి 12,27,342 గ్రంథములు గలవు; వీనిని 24,73,306 మంది ఇండ్లకు దీసికొని పోయిరి. స్వీడనుదేశ విస్తీర్ణము 1,79,384 మైళ్ళు. జనసంఖ్య 60,74,368. ఆదేశముయొక్క ఉత్తరపుకొననున్న మూడురాజధానులయొక్క విస్తీర్ణము 46,474 మైళ్లు. ఆరాజధానులందు మైలునకు ఇద్దరికంటె యెక్కువ జనము నివసించుట లేదు. అందుచేత ఈ దూర ప్రదేశములందలి జనులకు సంచార గ్రంథాలయములే శరణ్యములు. ఆప్రదేశములలో సంచారగ్రంథాలయములను ప్రచారము చేయుటకు గాను నాలుగుముఖ్యపట్టణములందు సెంటర్లను ఏర్పరచినారు.

స్వీడనుదేశ ధర్మగ్రంథాలయ సంఘము ౧౯౧౫ సంవత్సరమున స్థాపింపబడెను. ఆసంఘమువారొక పత్రికను గూడ ఆదేశభాషయందు ప్రకటించుచున్నారు. ఆసంఘమువారు ఆదేశ గ్రంథాలయ

ములకు అనువుగా నుండునట్లొక గ్రంథవిభజన పద్ధతిని ౧౯౨౧ సంవత్సరమునందు ఏర్పరచినారు. ఆపద్ధతిని ఆదేశగ్రంథాలయములన్నియు అవలంబించుచున్నవి. ఆ దేశమందు గ్రంథవిక్రేతలందరు కలిసి ప్రతి సంవత్సరము ప్రకటించు, "గ్రంథముల పట్టిక"యందుగూడ ఈగ్రంథవిభజన పద్ధతినే అవలంబించుచున్నారు.

ఆ దేశమందలి ధర్మగ్రంథాలయము లన్నిటికిని ఇంకను ఎక్కువ సహాయము చేయదగు మార్గములనుగూర్చి యోచించుటకు గాను ౧౯౨౪ సంవత్సరమునం దొక సంఘ మేర్పరుపబడెను. ఆసంఘము వారు దీర్ఘముగ యోజించి యొకప్రణాళికను తయారుజేసిరి. ఈ ప్రణాళిక ననుసరించి ధర్మగ్రంథాలయములు ప్రభుత్వమువారివలన ఇదివరలోకంటె ఎక్కువ సహాయమును పొందుచున్నవి. కొన్ని పెద్ద గ్రంథాలయములు జిల్లా కేంద్రగ్రంథాలయములగును. సలహాల నిచ్చుటయందును, అపూర్వములగునట్టియు విశేషము ఖరీదు గలిగినట్టియు గ్రంథములను ఎరువిచ్చుటయందును ఈ కేంద్ర గ్రంథాలయములు చిన్న గ్రంథాలయములకు తోడ్పడుచుండును.

"లింకోపింగు" పట్టణగ్రంథాలయము ౧,౪౦,౦౦౦ అచ్చు గ్రంథములతోను, ౨,౨౦౧ వ్రాత గ్రంథములతోను విరాజిల్లుచున్నది. ఆపట్టణమందున్న మునిసిపల్ గ్రంథాలయముతో గూడ గలసి ఈపట్టణగ్రంథాలయము కేంద్రగ్రంథాలయముగ ఏర్పరుపబడెను. ఈ కేంద్రగ్రంథాలయమునకు ప్రభుత్వమువారి గ్రాంటు 82 వేలరూపాయలు. తమకు "వినోదముల" మీద వచ్చినట్టి ఆదాయమునుండి ఒక లక్షరూపాయలను మునిసిపాలిటీవారు గ్రంథాలయ భవనమునకై వెచ్చించిరి.

"స్టాక్‌హోలం" పట్టణగ్రంథాలయ భవననిర్మాణమునకై "వాలెనుబర్గు" అను మహాదాతయు, వాని యర్ధాంగియు కలసి 4 లక్షలరూపాయలను దాన మిచ్చిరి. ఇదిగాక ఇంకొక ధర్మసంస్థనుండి

రెండున్నర లక్షలరూపాయలుఋయ్యబడెను. ఈపట్టణ గ్రంథాలయము గూడ కేంద్రగ్రంథాలయ మగును. ఆజిల్లాయందున్న చిన్నగ్రంథాలయములన్నింటిని యీగ్రంథాలయమువారు శాఖలుగ అంగీకరించి పుస్తకములను పంచుకేంద్రములుగ జేయుదురు.

"గోతెబర్గు"గ్రంథాలయముయొక్క సుందరభవనము౧౯౦౦ సం॥న తెరువబడెను. ప్రత్యేకశాస్త్రపరిశోధనకు యీగ్రంథాలయము ఏర్పరుపబడెను. స్కాట్లండ్ దేశస్థుడగు "డిక్సను"అనునాయన స్వీడన్ దేశమందు కలపవర్తకముచేసి మహదైశ్వర్యవంతు డాయెను. ఆయన గ్రంథాలయములకు సహాయముజేయుటకొరకనిధినిస్థాపించెను;ఆనిధివలన అయిదు గ్రంథాలయములు పోషింపబడుచున్నవి. "మాల్మో"పట్టణ కేంద్రగ్రంథాలయమందు ౭౨,౦౦౦ గ్రంథములు గలవు; ౧౯౨౭ సంవత్సరమందు 3,20,900 మంది ఆగ్రంథములను చదివిరి. నూర్కోపింగు" అనునది పారిశ్రామికపట్టణము. అందు ౬౦,౭౦౦ జనులు గలరు. ౧౯౨౭ సంవత్సరమునుండియు ఆపట్టణమునందొక గ్రంథాలయము గలదు. ఆపట్టణమునందున్న పలువురు వ్యక్తులు తమయొక్క అసంఖ్యాకగ్రంథములను ఆగ్రంథాలయమునకు దానమిచ్చిరి. అదివరకున్న చిన్న గ్రంథాలయమందున్న గ్రంథములు, పాఠశాలలయందలి గ్రంథములు—అన్నియు ఈనూతనగ్రంథాలయమందు జేర్చబడినవి; ఇవియన్నియు గలసి ౧,౦౦,౦౦౦ గ్రంథము లాయెను. "హెల్సింగుబోర్గు" అను పట్టణగ్రంథాలయమువారును అక్కడకు ౨౦ మైళ్ళదూరమందుడెన్మార్కు దేశమందున్న హెల్సింగోర్ పట్టణగ్రంథాలయమువారును పుస్తకములను పరస్పరము యెరువిచ్చుకొనెదరు. డెన్మార్కు, స్వీడను, నార్వే దేశములందలి భాషలు సజాతీయమైనవి. అందుచేత ఒకరి కొకరికి అర్థ మగుచుండును.

# శ్రీ నాగేశ్వరరాయ గ్రంథాలయము,
# నరసన్నపేట

ఈ గ్రంథాలయము చిరకాలము నాగేశ్వరరాయ గ్రంథాలయసంఘమువారి యాజమాన్యమున జక్కగ పనిచేసి ఉత్సాహము తగ్గుటచే మూడేండ్ల కాలముపాటు శ్రీయుతులు పోట్నూరు స్వామి బాబుగారి వశమందుండి, వారిచే నీయూరి సోషల్ క్లబ్బువారికి యెఱవుగా నీయబడినది. గ్రంథాలయ సంఘము ఆరుమాసములక్రిందట బునరుద్ధరింపబడినది. ఆసంఘమున ప్రకృతము 60 మంది సభ్యులున్నారు. పౌరాదరము బాగుగా గలదు. గ్రంథములు నుంచుకొనుటకు అందఱకు అందుబాటుగా నున్న శ్రీ వేంకటేశ్వరాలయమునందు వసతి యేర్పరుపబడినది. సోషల్ క్లబ్బువారిని తమ గ్రంథాలయము తిరిగి యిమ్మని పౌరులు అడిగినను ఇంతవఱకును గ్రంథాలయము నీయలేదు. ఆసోషల్ క్లబ్బు పూరియిల్లు; పాడువడి యున్నది. అందలి సభ్యుల కాటలమీదనున్న యాదరము చదువుమీద లేదు. ఎవరికితోచిన పుస్తకము వారు తీసికొని పోయి మరల యియ్యకున్నట్లు తెలియుచున్నది. బీరువాలు పాడువడి చెక్కలూడిపోయి యున్నవి. అవి బాగు చేయింపలేదు. ఎలుకలుపుస్తకములుకొఱికివేయుచున్నవి. గ్రంథాలయము నూరివారి కీయ మనుటకు సోషల్ క్లబ్బువారి కేమియధికారము గలదు? గ్రామస్థులు స్థాపించి గ్రామస్థు లభివృద్ధి పరచిన గ్రంథాలయము గ్రామస్థులకుగాక నౌకరీకి వచ్చినయుద్యోగులకెట్లు చెల్లును? ఈ గ్రంథాలయము విషయమై గ్రామస్థులు కోర్టుద్వారా చర్య జరుపనున్నారు. ఇంతకును సోషల్ క్లబ్బు పేరుతోనున్నవారు మూడున్నర మనుష్యులే. వారిలోను గొందఱు సద్బుద్ధి గలిగియే యున్నారు. వారికి మావందనములు, వారు చేయదగిన సాయము చేయుదురనియు నాశించుచున్నాము. ఇంక మిగిలిన రెండు మూడు వ్యక్తులుమాత్రమే యీ మొరకుదనము వహించి యభివృద్ధి కాటంకము కలుగజేయు

చున్నారు. గంజాం మండల గ్రంథాలయాధ్యక్షులు, కార్యదర్శిగారు, మ|| ఉన్నవ రామలింగం పంతులుగారు, బ్ర[illegible] సూర్యనారాయణ శాస్త్రిలుగారు మొదలగు మహనీయు లనేకులు మందలించినను దమ పట్టు వీడని వీరిచర్య మంచిదో చెడ్డదో పాఠకులే యూహింతురుగాక! గ్రంథాలయ సంఘమువారు నెలనెలకు క్రొత్తపుస్తకముల సంపాదించుచున్నారు. చందాలు బాగుగ వసూ లగుచున్నవి. అచిరకాలముననే సంఘము రిజిష్టరు చేయించు ప్రయత్నము జరుగుచున్నది. ఇట్టిసమయమున రాష్ట్రగ్రంథాలయసంఘమువారు తగిన రీతిని చర్యజరిపి గ్రంథాలయమును గ్రామస్థులకు వచ్చునట్లు చేసినచో వారొనర్పవలసిన యుత్కృష్టధర్మము నెఱవేర్చినవారగుదురు. ఇంచుమించుగ క్లబ్బు మెంబరు లందఱు బదిలీ యగుదు రని వదంతి. బదిలీయగులోపల గ్రామస్థుల మంచి సంపాదించుకొనునట్లు మా సోదరులకు పరమేశ్వరుడు సాయపడుగాక.

శాంతిః.

బొ|| అ|| సూర్యనారాయణ, బి. యె.,
కార్యదర్శి,
శ్రీ నాగేశ్వరరాయ గ్రంథాలయసంఘము.

# "విటికాన్" గ్రంథాలయము

క్రైస్తవమతమునందు "రోమనుచర్చి" అనునది ప్రాచీన సాంప్రదాయము. దీనికి "పోపు" అను మతగురువు రాజు. ప్రాచీనకాలము నుండియు "రోమనుచర్చి" వారందరును గ్రంథసమీకరణమునందు అమితముగ శ్రద్ధాళువులై యుండిరి. వారు అచ్చుగ్రంథములనేగాక వ్రాతగ్రంథములనుగూడ మిక్కిలి శ్రద్ధాభక్తులతో సేకరించుచుండిరి. దురదృష్టవశముచేత వీరిపుస్తక సముదాయములు అనేకసారులు

నశింపు చేయబడుటయో, చెల్లాచెదరై పోవుటయో తటస్థ మగుచుండెను. మతకలహములును- వానిచే గలిగిన హింసలును దీనికి కారణములు. ౧౪౧౭ సంవత్సరమునం దీగ్రంథాలయము ఒక మతగురువుచేత స్థాపింపబడెను. ఆతను జయించి తెచ్చిన ౩౪౦ గ్రంథములదే దీనికి ప్రాతిపదిక. అప్పుడిది 'రోము' పట్టణమందు స్థాపింపబడినది.

ఆయనకు పిమ్మట 'నికోలస్' అనునాయన మతగురుస్థానమునకు వచ్చెను. ఆయనకు పుస్తకము లన్న మిక్కిలిప్రీతి. గ్రంథసమీకరణమునకై యిరోపా దేశమునకేగాక గ్రీసు - కాన్స్టాంటునోపిలు-వరకుగూడ ఆయన పండితుల నంపెను. ఆయన ౧౪౫౫ సం॥ రమున చనిపోవుసరికి ఒక వెయ్యి గ్రంథములా గ్రంథాలయమందు చేరెను.

౧౪౬౪ సంవత్సరమునందు చనిపోయిన 'పియన్' అను గొప్ప శాస్త్రవేత్త తన కుటుంబమునకు విడిచిపెట్టిన గ్రంథముల సంగ్రహమంతయుగూడ ఈగ్రంథాలయమునకు జేరెను.

'సిక్సటసు' అనుమతగురువు విద్యావంతుడు గాకపోయినను యితరులందరికంటె యీగ్రంథాలయమున కెక్కువ సహాయముచేసెను. తాను మతగురుస్థానమునకు యెన్నుకొనబడిన వెంటనే గ్రంథముల నన్నిటిని ఒకయేర్పాటుప్రకార ముంచి దివ్యమైన భవనమునం దుంచెను. గ్రంథాలయమంతయు మూడుభాగములక్రింద భాగించి నాలుగు చావళ్ళయం దుంచెను. ఇందులో మూడుచావళ్ళయందు లాటిన్ను, గ్రీకు భాషాగ్రంథము లుంచబడెను. ఈమూడుచావళ్ళలోనికిని ప్రజాసామాన్యమంతయు వచ్చి చదువుకొనవచ్చును. నాలుగవ చావడి మాత్రము మతగురువుగారి స్వంతగ్రంథాగారముకొరకు ప్రత్యేకింపబడినది. ఆకాలమునాటి సుప్రసిద్ధ చిత్రకారు లిద్దరిచేత ఈచావడులు అలంకరింపబడినవి.

పిమ్మట "పాటినా" అను నాయనను యీగ్రంథాలయపాలనకు నియోగించిరి. ఈయన గ్రంథములకొరకే కాక పనివారలను తనిఖీ

చేయుటయందు గూడ శ్రద్ధవహించెను. వారికాలమందు గ్రంథాలయ సిబ్బందికి సంవత్సరమునకు మూడువేల రూపాయలు ఖర్చు అయ్యేడివి. ఈయనక్రింద ముగ్గురు గ్రంథభాండాగారికులు, ఒక బుక్కు బైండరు, కొందరు వ్రాయసగాండ్రు ఉండిరి. వారి జీతములు చాల తక్కువ. “ప్లాటినా”గారికి నెల ౧కి ముప్పది రూపాయలజీతము. గ్రంథభాండా గారికులకు నెలకు రు ౩ లు. వ్రాయసగాండ్రకు వారి పనిని బట్టి జీత మిచ్చెడివారు.

ఒక దస్తాకాగితములు వ్రాయునెడల రెండణాలు ఇచ్చెడివారు. వ్రాత మిక్కిలి బాగుండిన రెండణాలన్నర.

పుస్తకములను ఇనుపగొలుసులచేత బల్లలకు బంధించి భద్రపరుప బడెను. ౧౪౪౪ గొలుసులు (పుస్తకములను బంధించుటకు) ౩౭౫ రూ పాయిలకు కొనబడినవి. దీనిని బట్టి గ్రంథచౌర్యము యీకాలమునం దేగాక ఆకాలమందుగూడ విరివిగా వ్యాపించియుండె నని తెలియును. ౧౪౪౮ సంవత్సరమున “సిక్సటసు” అను మతగురువు చని పోవు నరికి ఆగ్రంథాలయ మందు ౩,౬౫౦ గ్రంథము లుండెను. ఈగ్రంథములకు గ్రంథకర్తలను బట్టి ఒకటియు, విషయములను బట్టి ఒకటియు, రెండు గ్రంథముల పట్టికలు అకారాదిగా తయారు చేయబడెను.

౧౫౮౯ సంవత్సరమునుండి ౧౮౩.౨ సంవత్సరమువరకు వచ్చిన అనేకమంది మతగురువులు గ్రంథాలయమందిరమును పెంపుజేసియు అమూల్యగ్రంథములను చేర్చియు దీని నభివృద్ధిపరచిరి. అగ్నిభయము లేకుండ కట్టబడిన గదులయందు అమూల్యగ్రంథము లుంపబడినవి.

ఈగ్రంథాలయము యొక్క గొప్పరాజభవనములయం దొక పెద్దచావడి గలదు; అది ౮౦ గజముల చతురమును, ౩౦ అడుగుల ఎత్తును గలిగియుండును. చావడికి రెండువైపుల గల ౧౪ కిటికీలనుండి వెలుతురు అమోఘముగా వచ్చును. ఈచావడి యొక్క నరంబీ యం భటను మిక్కిలి వింతను గొల్పు రూపములను, మతగురువుయొక్క

డాలును చిత్రింపబడి యున్నవి. ప్రసిద్ధపురుషుల నిజప్రతిమలు స్తంభముల మీాద చిత్రింపబడి యున్నవి. ఈప్రతిమలన్నియు భవనముయొక్క సరంబీని మోయుచున్నటుల జూపట్టును.

ఈ గ్రంథాలయమందున్న గ్రంథములన్నియు ముఖ్యముగా చారిత్రాత్మకమైనవి; ఇట్టి గ్రంథములు ౬౦,౦౦౦ లకు పైగా గలవు. ఈగ్రంథాలయమందు అనేక శతాబ్దములందు సేకరింపబడిన 5,00,000 అచ్చు గ్రంథములు గలవు. ఇవిగాక లాటిను భాషయందు చేతితో వ్రాయబడిన 32.000 గ్రంథములు గలవు. గ్రీకుభాషయందు చేతితో వ్రాయబడిన ౪౨౬౦ గ్రంథములును, తూర్పుదేశభాషలయందు చేతితో వ్రాయబడిన ౪౦౦౦ గ్రంథములును గూడ గలవు. ఇప్పటికిని మతగురువునకు వ్రాత గ్రంథముల సమీాకరణ మనిన మిక్కిలిప్రీతి. "మెసపటోమియా"లో కొన్ని వ్రాతగ్రంథములు దొరుకునని తెలిసి, వానిని సంపాదించుటకుగాను క్రిందటి సంవత్సరమే మతగురువుగారు ప్రతినిధి నంపెను.

౧౫౯౧ సంవత్సరము మొదలు ౧౯౨౬ సంవత్సరమువరకు ఈగ్రంథాలయమందు గ్రంథములయొక్క గొప్ప సముదాయములు పదునాలుగు చేర్పబడినవి. ప్రతిసముదాయమును ప్రత్యేకస్థానమునందుంచిరి. ప్రతిసముదాయమునకును ప్రత్యేకముగ గ్రంథవివరణపట్టిక గలదు. "ప్లాటినా" అనునాయనకాలమునుండియు యీగ్రంథాలయములయొక్క గ్రంథభాండాగారికులందరు ఇందుగల అమూల్య గ్రంథములను విభజించి గ్రంథవివరణపట్టికలను తయారుచేయుటయందే తమజీవితములను ధారబోసిరి. పదునేడవ శతాబ్దాంతమున తయారుచేయబడిన ఈగ్రంథాలయమందలిగ్రంథములజాబితా యిరువదితొమ్మిది పెద్ద "వాల్యూము" లందు గలదు; లిపి శాస్త్రమందు పండితులగువారిచే యీజాబితాలు తయారుచేయబడినవి. తరువాత శతాబ్దములందుగూడ గ్రంథములజాబితాలు తయారుచేయబడి

నవి; ఇవియన్నియు వ్రాతయందే యున్నవి ; పదు నెనిమిదవశతాబ్దము యొక్క రెండవఅర్థభాగమునందు మూడువాల్యూములు అచ్చు వేయబడినవి. మొదటి వాల్యూము ౧౭౫౬ సంవత్సరమందు అచ్చు వేయబడినది. ఇప్పటివరకు గ్రంథముల జాబితాయొక్క పదునాలుగు వాల్యూములు మాత్రము అచ్చువేయ బడియున్నవి. ఈపదునాలు గింటియందును ౬,౨౮౧ వ్రాతగ్రంథములయొక్క సంక్షిప్త వివరములు మాత్రము గలవు. ఇంకను వివరింపబడవలసినవి ముప్పదినాలుగువేల పై చిల్లరగ్రంథము లుండగా యీపని యెప్పటికి ముగింపుకాగలదో తెలి యదు. కాని ఆగ్రంథాలయమందు పనిజేయు గ్రంథబాండాగారికులు మాత్రము విశేషపరిశ్రమను జేయుచున్నారు. ఇంకొక మూడు వాల్యూములు ప్రకటనకు సిద్ధముగా నున్నవి. ఇప్పటికి ప్రకటింపబడిన పదునాలుగు గ్రంథవివరణ పట్టికలయందును ౨౨౮ పుటల ఉపోద్ఘాతమును, ౨,౫౧౭ పుటల గ్రంథవివరణమును గలవు. పదునొకండుగురు గ్రంథభాండాగారికు లీ పట్టికలను వ్రాసిరి ; అట్లు వ్రాసినవారిలో ఆరుగురు పరమపదించిరి.

ఇవిగాక గ్రంథాలయపక్షమున 'స్టూడిటెస్టి' అను గొప్ప గ్రంథమొకటికూడ ప్రకటింపబడున్నది. దానిని ౧౯౦౦ సంవత్సరమున ప్రారంభించిరి. ఇప్పటివరకు ౮౭ సంపుటములు ముద్రితమైనవి; ఈసంపుటములందు ౧౧,౧౮౦ పుటలు గలవు.

ఇట్టి మహత్తరకార్యములను నిర్వహించుటకు యీ గ్రంథాలయమందు పదునెనిమిది గ్రంథభాండాగారికులు మాత్రము గలరు.

ఇంతవరకు చెప్పిన దంతయు వ్రాత గ్రంథములను గురించి మాత్రమే. వ్రాత గ్రంథముల ప్రాముఖ్యమే ఈగ్రంథాలయమును ప్రాముఖ్యతకు దెచ్చెను. ప్రపంచమునందన్ని భాగములనుండియు పండితులును విద్యార్థులును గూడ యీగ్రంథాలయమునకు విచ్చేసి, అపూర్వ చరిత్రపరిశోధనలను గావింపుచుందురు. అందుచేత ఈగ్రంథాలయమునకు సమగ్రమగు గ్రంథవివరణ పట్టిక తయారగుట అత్యంతావశ్యకము. వివిధకాలములందు చేర్చబడిన గ్రంథసముదా

యములు పదునాలుగింటికిని వేరువేరు గ్రంథవివరణ పట్టికలు గలవని చెప్పియుంటినిగదా! పట్టికలన్నియు ఒకవిధానము ననుసరించి తయారైనవిగూడ గాదు. అందుచేత ఒకరు ఒకగ్రంథమునకై వెదుకవలె నన్నచో తనకు కావలసిన గ్రంథము దొరకు వరకును గ్రంథవివరణ పట్టికల నన్నిటిని వెదుక వలసియుండును. అందువలన అనవసరకాలహరణము గలుగుచుండును. చదువు కొన్న పండితుడు అనవసరకాలహరణము నెంతమాత్రమును సహింపజాలడు. అందుచేత యీ పట్టికలన్నింటి నుండియు సమగ్రమగు పట్టిక నొకదానిని తయారు జేయుటకు ఏర్పాటులు జరుగుచున్నవి.

ఈ గ్రంథాలయము యొక్క గ్రంథవివరణ పట్టికను తయారు జేయుటకై అమెరికా దేశమదంలి "కార్నీజీ ఎండోమెంటు" వారు సహాయము జేసినారు. "రోము"నుండి నలుగురు మహానుభావులు గ్రంథవర్గీకరణపద్ధతిని చదువుకొనుటకై అమెరికా దేశమున కేగినారు. వారి చదువు పూర్తియైన పిమ్మట తమ దేశమునకు బోయి ఈగ్రంథాలయమునందు చేయవలసిన పనిని అందుకొనెదరు.

## సహకార గ్రంథాలయము, కావలి.

నెల్లూరుజిల్లా కావలి పట్టణములో "సహకార గ్రంథాలయ" మను పేర ఉచితగ్రంథాలయము, పఠనమందిరము 3-11-28 న స్థాపింపబడినది. ప్రస్తుతము 150 గ్రంథములు గలవు. కావలి గ్రామములో పనిచేయు సహకారసంఘముల సముదాయపు నిధితోను ఉదారహృదయుల సహాయముతోను ఈ సంస్థ పోషింప బడవలసియున్నది. కావున అందరు సహాయముచేయ బ్రార్థితులు.

సిద్ధాంతి వెంకట సిచ్చయ్య, బి. ఏ.,

వ్యవస్థాపకుడు,